గీ. ఎదురుగా వచ్చి శుక్రుని కెలమి మ్రొక్కి
కలువరాయఁడు దనుజులఁ గౌఁగిలించి
వారివరుసలు మెఱయంగ వారు దాను
నెరసి క్షీరోదకన్యాయమున వసించె. 201

వ. అనుటయు. 202

ఆశ్వాసాంతము.

శా. శ్రీరామానుజకీర్తిధారణ! రణశ్రీవేణికాఖడ్గధా
రారాజత్కరపద్మ! పద్మహితకృద్రంగద్భుజాధామ! ధా
మారామాంబుజవాసినీ పదసముద్యన్మాపురారావదీ
ర్ణారాతిప్రభుకర్ణ! కర్ణశిబికల్పా! కల్పదానోదయా! 203

క. ధారాళజయవిహారా! హారాయతకీర్తికృతదిశాలంకారా!
శారావసదరివారా! వారాశిశయానపాదభక్త్యాధారా! 204

తోటకవృత్తము.

కురుకరహాటకరూశవరాటకకోసలభోజకళింగమహీ
వరనుతహాటకరత్నకవాటకవర్ణితకూటక! దానజితా
మరుతరువాటక! సద్గుణపేటిక! మర్దితతాటక! సాత్కృతధీ
విరచితనాటక! దండకఝూటకవీంద్రకిరీటకశాకలితా! 205

గద్య. ఇది శ్రీజానకీరామచంద్ర చరణారవింద వందన కందళితానంద
కందాళ రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవ
శేషము కృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ
వేంకటపతి నామధేయ ప్రణీతంబైన
శశాంకవిజయంబను మహాప్రబంధమునందుఁ
చతుర్థాశ్వాసము.



శ్రీరస్తు.

# శశాంకవిజయము.

## పంచమాశ్వాసము



శ్రీమన్నరురరంగాధిప
రామానుజగుణగణాంకరచనాముదితా
హేమాచలమలయాచల
సీమాచరసుకవిచంద్ర! సీనసుధీంద్రా!

వ. అవధరింపుము సూతుండు శౌనకాదిమునీంద్రుల కిట్లనియె.

క. అంత శశీకాంతుఁడు మది
నెంతయుఁ గుతుకమున వీరశృంగారరసా
త్యంతరమణీయవైఖరి
వింతై కనుపట్టు మహితవిభవము మెఱయన్.

సీ. ధళధళద్యుతి నిండుతగటిమెఱుంగు దు
ప్పటి కాసెచెంగులు బాగుమీఱ
మృగమదాంకితమైన మేన వేగన్నులఁ
గనుపట్టు ఘనవజ్రకవచ మొప్ప
దివ్యమాణిక్యదేదీప్యమానకిరీట
ఘృణులెల్ల దెసల నీరెండ గాయ
కంకణమార్వీకిణాంక మౌ కెంగేల
శతకోటి శతకోటి చెన్నుమిగుల

గీ. కల్పసుమధామభూషణోత్కరము మెఱయఁ
జెలఁగి దేవర్షిగణము లాశీర్వదింప
మందహాసంబు మోమునఁ గందళింప
వెడలె జంభారి కయ్యంపువేడ్క మీఱ. 4

శా. ఆ రీతి న్జనుదెంచి యా ఘనుఁడు ప్రోద్యద్దానధారాఝురీ
పూరంబు ల్సెలయేరులై తగ జగాపొంబట్టుసాల్ గైరిక
శ్రీ రంజిల్లఁ జరత్తుషారగిరి నాఁ జెల్వొందు నైరావతం
బారోహించె దిశావకాశములఁ దూర్యారావము ల్నిండఁగన్. 5

చ. అఱిముఱి వహ్ని మేషము కృతాంతుఁడు దున్న నరాశి మానవున్
వరుణుఁడు నక్రరాజమును వాయువు లేడి కుబేరుఁ డశ్వ మీ
శ్వరుఁడు వృషంబు నెక్కి వడి శక్తియు దండము కుంతపాశముల్
సురుచిరమా ధ్వజంబు నసి శూలమునుం గొని తోడుగూడఁగన్. 6

ఉ. మోమున లేఁత నవ్వెసఁగ ముత్యపుటొంట్లసియాడ మల్కుతో
డా మెనపెట్టి కట్టిన కడాని జగాజిగిపాగమీఁద ని
ద్దా మెఱుఁగుం దురా గులుకం దండిప్రిఱుందు జయంతుఁ డాశ్విక
స్తోముఁడు తోడివచ్చె రవజో డలర న్వాలివాజి మీటుచున్. 7

ఉ. స్వర్ణచిరత్న రత్నమయ చక్రరవంబుల నబ్జజాండముల్
ఘూర్ణిలఁ గేతుకోటిమెఱుఁగు ల్నిగుడ న్వరహేమభూమిభృ
త్తర్ణకవైఖరిం దగ రథంబులు గొల్వఁగఁ జేరి మ్రొక్కి య
భ్యర్ణమునందె మాతలి రయంబున వచ్చె బలారి మెచ్చఁగన్. 8

మ. బహువర్ణాఢ్యకుథవ్రజంబు మణిచాపప్రక్రియ న్మీఱఁగా
సహనోదంచితహేమకక్ష్యలు తటి న్మంజుస్థితి న్బూనఁగా
లహరీవన్మదవారివర్షముగ లీల న్మత్తమాతంగముల్
రహిఁ గన్పట్టెను మేఘవాహనునిమ్రోల న్మేఘజాలం బనన్. 9

మ. హరి గన్పట్టెను విశ్వరుద్రవసుమాహారాజికాదిత్య భా
స్వరవిద్యాధరసిద్ధసాధ్యతుషితస్వర్వైద్య గంధర్వకి

న్నరయక్షోరగచారణానిలసువర్ణ శ్రేష్ఠు లుద్యద్గదా
పరిఘుప్రాసపరశ్వధాసిధరులై పార్శ్వంబులం గొల్వఁగన్. 10

మత్తకోకిల

ఇత్తెఱంగున మోహరించి మహేంద్రుఁ డాహవకౌతుకా
యత్తచిత్తత సర్వదిగ్వలయాంబరక్షితిభాగము
ల్బిత్తు లెత్త గభీరభైరవభేరికా పటహంబు లు
ద్వృత్తి మ్రోయఁగ ముజ్జగంబుల బ్రుంగుభంగిఁ గడంగినన్. 11

క. చారులచే నా చందం, బారూఢిగఁ దెలిసి చంద్రుఁ డాహవకేళీ
ప్రారంభసూచకంబుగ, వీరోత్సాహమున భేరి వేయించుటయున్.

చ. చెదరె గిరుల్ దివం బడరె శ్రీపతి దిగ్గున నిద్ర మేల్కొనెన్
బెదరె నజాండభాండములు భేదిలె నాదిమభోగి కన్నుగ్రు
డ్లదిరెఁ గలంగె వారినిధు లొక్కట దిక్తటసంధిబంధము
ల్వదలెను బొట్లపువ్వులన వ్రాలెను ఝుల్లనం జుక్కలత్తఱిన్. 13

సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బ గుప్పినసొంపుఁ
గను నురంబున దివ్యకవచ మొప్ప
జవరాలి నునుకీలుజడ వేటుదద్దుము
ద్దుల వెన్నునను గవదొనలు మెఱయ
వెలఁదికీఁ గలపంబు నలఁద ఘుమ్మను పాణి
తలమున గాండీవధనువు దనరఁ
గిసలయాధర మేని పసపుడా ల్దుప్పటి
కాసె నొప్పగు మొలకత్తి యమర

గీ. మోముఁదామర చిఱునవ్వు మురువు మీఱఁ
దారఁ గౌఁగిటఁ జేర్చి యత్తలిరుఁబోణి
కులుకు కిలికించితంబుగ గెలువు మనుచుఁ
బనుప రహి మీఱి వనజారి బయలుదేఱె. 14

## పంచమాశ్వాసము.

మ. బలువజ్రంబులబండ్లు కెంపుటిరుసు ల్ప్రోఁబచ్చుటాకూబరం
బులు సన్నీలమణిత్రివేణువు మహాముక్తామణీపీఠమున్
దెలివాజు ల్హారిణధ్వజంబు నమరన్ దివ్యాయుధోదగ్రమౌ
నలఘుస్యందన మెక్కి దైత్యగురుక్లుప్తామోఘలగ్నంబునన్.

సీ. అతిలోకభుజగర్వుఁ డగు వృషపర్వుఁడు
విషమాహితులమిత్తి విప్రజిత్తి
యరిచమూచిత్తదత్తామయుండు మయుండు
శంబరుం డురుబలాడంబరుండు
సమరసైన్యాజయ్యుఁ డగు శతమాయుండు
తారకుం డనలోగ్రతారకుండు
ఘనవిభాజితవిరోచనుఁడు విరోచనుఁ
డాహవదళితాభియాతి హేతి

గీ. యనెడు దైత్యేంద్రు లెనమండ్రు నాజిఁ దామె
యష్టదిక్పాలకుల నోర్తు మనుచు సింహ
శరభశార్దూలవృకఘోణిఖరమహోష్ట్ర
తురగముల నెక్కి యుద్ధసన్నద్ధు లగుచు.

చ. వెడలఁ దదీయసైన్యములు వెల్వడె నుగ్రతఁ గాలమేఘము
లడఁగినలీల నొక్కమొగి గాటపుఁగాటుకకొండతండము
ల్వెడివడినట్లు లబ్ధు లతివేలములై యరుదెంచునట్లుగా
నడిదములున్ గద ల్గుదియ లమ్ములు విండ్లును బూని యుగ్రత

సీ. మదచండవేదండమండలు ల్గొండలు
ఘోటకచ్ఛట లూర్మిఝాటకములు
దరదములై యొప్పు నరదముల్ దీవులు
పటువాళ్ళు కడమి గప్పడు మొసళ్ళు
కరవాలచయము భీకరవాలమీనముల్
చక్రసంహతి తోయచక్రవితతి

చంద్రార్ధచంద్రాంకచర్మము లూర్మము
లాయుధద్యుతిజాల మహార్చికీల

గీ. లగుచుఁ గనుపట్టు దైత్యసేనార్ణవంబు
భూరిచంద్రోదయంబునఁ బొంగి పొరలి
కెరలి శరలీల వరలంగఁ దరలివచ్చు
నమరవాహినితో ముదం బమరఁ గవిసె. 18

ఉ. ఆ పగిదిన్ ఘటించి యమరాసురసైన్యము లంత నెంతయున్
గోపము లగ్గలింప సెలగో ల్జగడంబునఁ జేసి చేరి తోఁ
దోపులమీఱి మేటిరవుతుల్ తురగంబుల మీఱి పిల్వఁ జె
య్యూఁపక పూర్వపశ్చిమ మహాంబునిధు ల్వలెఁ దారసిల్లినన్.

క. సుభటుఁడు సుభటుఁడు హరి హరి
యిభ మిభమున్ రథము రథము నెదిరించిన యా
రభస మది యేమి చెప్పన్
నభ మగిలెన్ బుడమి గ్రుంగె నగములు పగిలెన్. 20

వ. ఇవ్విధంబునం గ్రమ్మి యమ్మోహరంబులు రెండును ముమ్మరం బుగాఁ బోరునవసరంబున యుగనిగమనారంభసంరంభవిజృంభమాణ మహాంభోధరగర్జాగంభీరంబులైన భేరీభాంకారంబులును, ప్రళయ కాలభైరవహుంకారశంకారచనా చరణంబులైన భీమధమాధమికా ధమధమత్కారంబులు నకుంఠితపురుషకంఠీరవకంఠ నాళక్ష్వేళా కరాళంబులైన వీరకాహళీ కోలాహలంబులును విగ్రహావేళాగ్ర హోదగ్రహయగ్రీవగ్రీవామహోగ్రహేషాభీషణత్క్రూరంబులైన బూరగలరవంబులును మంథాచలమంథానమథ్యమానమహార్ణవో దీర్ణనినాదానువాదంబులైన యసంఖ్యశంఖఘుమఘుమప్రణాదంబు లునుసంవర్తనర్తనప్రవృత్తమృత్యుంజయచరణసంఘటనస్వనపోష ణంబులయిన వీరభుజాస్ఫాలనని ర్ఘోషణంబులునుత మహావరాహ

ఘోణారవజయప్రవీణంబులయినపటహడిండిమడమరుఢక్కాఝల్లరీ
తమ్మటప్రముఖనిఖిలవాద్యరావంబులు గొల్లన నుల్లసిల్లిన ఝల్లన
మదంబు లుప్పతిల్ల నిప్పు లురులుచూడ్కులఁ బ్రతిసేనాగజంబులఁ
గనుంగొని ఘళంఘళధ్వానంబులు మీఱ బారి గొలుసులు పర
బలంబులఁ బాయం గొట్టి యుద్యదాధోరణంబులయిన రిపువారణం
బులఁదాఁకి ఘణిల్లు ఘణిల్లునం గొమ్ముక ట్లొరయ నగ్నికణంబులు
నభోంగణంబున కెగయఁ గఠిల్లు పెఠిల్లునన్ గఠోరదంతంబులు చిటులఁ
దుండంబులు పెనుచుకొన నొండొంటిం దాఁకి ఘణంఘణితకాంచన
ఘంటికాసంఘంబులతోడం గూడ ఱెక్కలతోడికొండలుంబలె నొక
టొకటిం బట్టికొని యిమ్ముగా దంభోళిశకలాకారంబులైన కొమ్ము
కత్తులుగట్టినకొమ్ము లెంతయుం జూడఁ గ్రుమ్ములాడుచుం బోరు
సేనుంగులును దరటు గావించి ఘోటకంబుల మీటి ప్రతిబలం
బులు బడలువడం జొచ్చి పగతురు నిగిడించు కుంతతోమర ప్రాస
శక్తిశూలాద్యాయుధంబులు చిదురుపలై గగనంబున కెగయం
దొడుపుకత్తులు బిసబిసవిసరుచు వేడంబులఁ దిరుగుచుఁ గేడెంబు
లొడ్డుకొని చకచకాయమానంబులయిన చికిలి బాకుతారులు గొని
నఱుకులాడు రవుతులును, రథచక్రఘోషంబులును, గేతనపట
పటాత్కారంబులునింగిముట్ట నరదంబులు నిబ్బరంబుగాఁబఱపుచుం
బ్రతిశతాంగంబుల నబ్బాటుగా మెట్టింపుచు, లాఘవలక్ష్యశుద్ధి
దృఢత్వచిత్రత్వంబులు మెఱయ సరయంబుగాఁ గోదండపాండి
త్యంబు నెఱపుచు నంపపరంపరలం బెంపరలాడు రథికులును,
గుఱికాండ్ర చేసన్న నుబ్బి గబ్బి మిగులం బొబ్బలిడుచు నొక్క
నితోఁ బెక్కండ్రును బెక్కండ్రతో నొక్కండును దారసంబై
యీరసంబున నుక్కునారాసంబులు నిగిడించియుఁ జేరినచోట
నీటెలం బోటులాడియు డాసినయెడఁ గరాసిఁగొని మిగులహత్తిన

మెడ సూరి కత్తులం గొని యుద్ధు లుద్దులుగా గ్రుద్దులాడు కాలు బంట్లును గలిగి దారుణంబయిన యా రణంబునఁ దదీయ క్రోధాగ్ని ధూమస్తోమంబుల-చొప్పుననుప్పరంబునన్ గప్పలు విరాటుకుంగప్పు కప్పు దుప్పటియొప్పున గుప్పనం దుప్పఁ గట్టుటయును దమవా రని యుఁ బెరవారనియునుం దెలియక చేసన్నలం దడవి పట్టుకొని యుబ్బిన కైదువులచే నేటులాడి ర య్యవసరంబున న య్యమరాసుర సేనాసందోహంబులు నెత్తురువానల నమ్మహీపరాగం బడంగు టయు ఖండంబులయిన తుండంబులును చుమ్మురయినకొమ్ములును ఛేదంబులయిన పాదంబులును దీర్ణంబులయిన కర్ణంబులును జీలిక లయిన చూళికలును విద్ధంబులయిన వాహిత్థంబులును గాయంబు లయిన కాయంబులునుం గలిగి మావంతులతోడం గూడఁ బీనుంగు లయిన యేనుంగులును బగిలిననోళ్ళును బరియలయిన జోళ్లును దుని సిన శిరంబులును దుమురులయిన ఖురంబులును జీలిన గల్లంబులును జిద్రుపలైన పల్లంబులును పీడినభూషణబృందంబులునునలిసినకొమ్ము లును నజ్జులైన మెమ్ములును బ్రద్దలైన వెన్నులును బగిలినకన్నులును దెగిన వాలంబులును దీనదశంబొందినరాహుత్తజాలంబులునుగలిగి యపరిమితరక్తధారాతరంగంబులును జక్రంబులు వ్రీలి సారథుల్ గూలి కేతనంబులు వ్రాలి కింకిణులు రాలి రథికులుసోలి రథ్యంబులు వ్రేలి రయంబులు మాలి రణాంగణంబునం దూలి హతాంగంబు లైన శతాంగంబులును బదంబులు రదంబులును బాణులు కృపా ణులును నురంబులు శిరంబులును వర్మంబులు చర్మంబులును వెన్నులు చన్నులును బక్కలు డొక్కలును పీనులు జానులును నేత్రంబులు గాత్రంబులును ఫాలంబులు కపోలంబులును దొడలు మెడలును వ్రేళ్ళు నోళ్లును గడికండలు పడకండలు నెత్తురులు గ్రక్కుచుఁ బొడచినపోటుగంటివెంబడి వేదురెక్కినటికి యరివీరుల శిరంబులు ద్రొక్కిద్రొక్కి-రిసినవైరిభటశరీరంబులుతలగడులుగానాడు

గఱిచి మీనంబులమీఁదఁ జే ప్రైచికొని గతప్రాణులై పడిన వీర
భటులు గలిగి సంగరాంగణంబు ఘోరంబయ్యె నప్పుడు కేశంబులు
శైవాలంబులును మొగంబులు పద్మంబులును భుజంబులు మీనం
బులును శిరఃకపాలంబులు గవ్వలును ద్విపంబులు ద్వీపంబులును
జూర్ణితాభరణరత్నరాసు లిసుకలును గంతంబులు శంఖంబులును
మేదోమాంసమస్తిష్కంబులు పంకంబులునుం గలిగి సురాసుర
శరీరపట్టంబులు దెట్టలం ద్రోయుచు వేలకొలందులగు నెత్తురు
టేరులు ప్రవహింప నందు భూతభేతాళ ఢాకినీ శాకినీ యాకినీ లాకినీ
పిశాచకూశ్మాండ రాక్షసాదిగణంబు లుద్దులుద్దులుగా నోలలాడు
చుం బ్రిమోదంబునం దేలుచు నరంబులం బెనచి కరంబులం గట్టిన
శిరంబు లను నందెలును గజతుండఖండంబు లను చిమ్మనగ్రోవులం
బట్టి నెత్తురునీరు చిమ్ములాడుచు మునింగి యొండొరులం బట్టుచు
నిట్టలంబుగా జలక్రీడలాడి క్రొవ్వుపొర లను తెలిచల్వలం గట్టి
నల్ల లను తిలకంబులు దీర్చి సన్నపురంబు లను సరంబులు వైచి
నేత్రకమలమాలికాజాలంబులు ధరియించి మెదడుగంధంబు లలంది
గుండెతండంబులు మెక్కి క్రొత్త రక్తంబులు గ్రోలి చొక్కి
సోలుచుఁ గరతాళగతుల నాడఁ దొడంగి రప్పు డయ్యెరువాగునం
గడిందివీరు లను బేహారులు రథంబు లను నోడల నెక్కి సంగరం
బను సంద్రింబుఁ జొచ్చి తమ తమ ప్రాణంబులను ధనంబు లిచ్చి
నిచ్చలంబయిన కీర్తు లను ముత్యంబులు గొని రాసులుపోసి రయ్య
వసరంబున దుర్వారగర్వంబులు పర్వ గీర్వాణులు ద్రోసి నడిచినం
బూర్వగీర్వాణులు నెగ్గబారిన వృషపర్వుం డదల్చి తెరలిన బలం
బుల మరలం బురికొల్పి తక్కిన దండనాథులుం దానును రథనేమీ
క్రేంకారభేరీభాంకారశింజినీటంకార వీరభటహుంకారంబులను
వియత్తలంబు నొంది యెదిర్చుటయు నిలింపులు గుంపులుగూడి
తెంపునం దారసిల్లిన నింద్రుండును వృషపర్వుండును నగ్నియు విప్ర

జిత్తియు దండధరుండును చామరకుండును మయుండును నైరృతియు వరుణుండును శంబరుండును వాయువు శతమాయుండును గుభేరుం డును విరోచనుండును దుర్మదుండును నీశానుండును హయగ్రీవ శుంభనిశుంభులు నాదిత్యవసురుద్రులును ద్వంద్వయుద్ధంబునకు దొరకొనఁ దొణంగి రప్పుడు. 21

ఉ. సింగముమీఁద నెక్కి పటుశింజిని మ్రోయఁ గడంగి విక్రమా భంగత నిందు్రి డాసి వృషపర్వుఁడు శాతశరంబు లేయ శ క్తిం గొని వైచి యింద్రుఁ డల కేసరిఁ గూల్చిన వాఁడు తేజికిన్ జంగున దాఁటి దాఁటి సురసామజరాజముఁ జూచి మీటినన్. 22

వ. త దనంతరంబ యాలోన. 23

క. పారగజేంద్రము దానిం
బారి గొలుసుచేత విసరఁ బటురయమున న
వ్వారువము గాలిచక్రిము
దారి న్వేడెములు దిరుగ దనుజేంద్రుండున్. 24

క. నేజము గొని యిప్పోటున, నే జమునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్ జేజే లిడ సాహసమున, జేజేలగజంబు కుంభసీమం గ్రుమ్మెన్. 25

క. దానికిఁ గలఁగక శతముఖు, దానికినుకమీఱ దానధారాస్ఫురణం బూనికరమ్మునఁజిమ్మెను,బూనికరమ్మెదురదనుజపుంగవుహయమున్.

క. అందుకు వెఱవక తురగము, కందుకమట్లెగసి తూఱఁగా నిగళముచే నందుకొని ఘలఘలధ్వని, గ్రిందుకొన న్విసర వేల్పుగజమవ్వేళన్.

క. సుడివడక యె వేదంబుల, సుడిగాలిగతిన్ హయంబు సురకరిఁ జుట్టన్ వడిదిరుగఁగనడిదముఁగొని, బెడిదముగానఱకివాఁడు పెళపెళనార్చెన్.

క. అమ్మదనాగేంద్రంబును, గుమ్మరసారెగతిఁ జుట్టుకొని వడిదిరుగన్ ముమ్మాఱెయనుచుఁజూపఱుముమ్మాఱుంబొగడిరొక్కమొగినవ్వేళన్

క. వాలమ్మున నింద్రుఁడు కర, వాలమ్మున నుగ్గుసేసి వానిహయంబున్ ఫాలమ్మునొవ్వనేసిన, నాలమ్మునఁ బఱచె నది మహావేగమునన్.

ఉ. అంధకు యుగ్రతుండమున నంధకు నబ్ధిఁ బరిభ్రమించు న
మ్మందరశైలమో యన నమందర మన్ దివిజేంద్రుదంతి వీఁ
కం దగఁ ద్రొట్టి నిల్చుతురగం బురగం బురగారిఁ బట్టుచా
యం దగఁ బట్టెఁ గంద మన నందఱు నం దరుదంది చూడఁగన్.

ఆ. హయము విడచి యసుర రయమున లంఘింప
నమరగజము వాని నమరఁ గజము
చెంత కనిచె నంత నంతకాకృతి నతం
డరద మెక్కె నీలశరదలీల. 32

క. కనుపట్టి శరపరంపర, లనిమిషపతిమీఁదఁ గురియ నతండును రింఖ
త్కనకమణిపుంఖశరముల,నినిచెను దినకరుఁడుకిరణనికరముపోలెన్.

చ. అనలుఁడు విప్రజిత్తియు రయంబున మార్కొని పోరువేళ న
య్యనలుఁడు సప్తసాయకము లాతని పై నిగిడింపఁ దోడనే
తునిమి యతండు తత్తనువు తొమ్మిదియమ్ముల నాట నాతఁ డా
తని విలుఁద్రుంచి నొంచిన నతండును వేఱొకవింట మార్కొనెన్.

సీ. తారకయములు విస్తారకనచ్చాప
నైపుణిఁ బోరి రందఱును బొగడ
మయనైరృతులు వహ్నిమయనైక శరముల
నొక్కరొక్కరిఁ గప్పి రుక్కు మీఱ
శంబరాబ్ధిశులు శంబరాజద్బాణ
శతము లేసిరి పరస్పరతనువుల
హేతిసమీరణుల్ హేతిఘట్టనలచే
మిణుఁగురు లెగయంగ రణముఁ జేసి

గీ. రల విరోచనుఁ డబ్ధేశు నలవి లేని
భల్లముల నేయ నాతఁడు విల్లు దునిమె
దుర్మదుం డిందుమౌళితోఁ దుర్మదమునఁ
బోరెఁ గేసరితోఁ గరి పోరినట్లు.

క. తక్కఁగల దనుజవీరులు, తక్కటిగీర్వాణవరులు దలపడి వైరం
బెక్కఁగ నెక్కటి పోరిరి, యుక్కున బ్రహ్మాండభాండము బ్రద్దలాగన్.

క. నక్రౌర్యత నా వేళన్, శుక్రుఁ[illegible] జూచి పోల్లుంఠనముల్
వక్రోక్తినాఁడ నాతఁడు, శక్రు[illegible]చేఁజూడ శతమఖుఁడని యెన్.

క. నేఁడే కడంగి శుక్రుఁడు, చూ[illegible] దనుజశూన్యమొనర్తున్
జూడుఁడు వేడుక యెుఱుఁ[illegible]యుతని చిత్తము దరఁగ ననుచున్.

లయగ్రాహి.

బంగరుబెడంగు బలుసింగిణి వడిం గరము
నం గొని కడంగి ధర నింగియుఁ గలంగన్
ఖంగు ఖణి ఖంగు రనుచున్ గుణ మెసంగి మొఱ
యుంగఁ బ్రజలం గినిసి ప్రింగు జముభగింన్
బొంగి సమరాంగణమునం గజతురంగమ శ
తాంగసుభటాంగము లిలం గలిసి క్రుంగన్
సింగము కురంగనమితిం గసిమసంగెడు త్రై
అంగున నభంగజయ సంగతిఁ జెలంగన్.

ఉ. తోడనె కూడి దిక్పతులు దుస్సహసూర్యకరంబులో యన
న్వేఁడిమి మీఱు బాణముల వేలకొలందిగ దైత్యవీరులన్
బోఁడి మడంప వారలును బోరన పోరొనరింపఁ జాలకే
ప్రీడ దొలంగి పాఱి రటు వేలుపుమూఁకలు వెంటనంటగన్.

క. మాయాదివ్యంతులు శత
మాయాది నిశాటవరులు మఱలి చలమున
న్మాయాదరణమున దివిజుల
మాయఁగఁ జేయుటకు నైకమత్యము మెఱయన్.

సీ. నగములై క్రూరపన్నగములై హాలహాల
గరములై ప్రళయసాగరము లగుచు

ధరములై కాలాంబుధరములై యసిపత్రి
వనములై ఝుంఝూపవనము లగుచు
ఖరములై ద్విరదశేఖరములై పటుపాద
రసములై కఱకునారసము లగుచు
జలములై రక్తపింజరములై దుర్వార
తమములై సైంధవోత్తమము లగుచు
గీ. వెలపుఁ బుట్టించి పోనీక వెంబడించి
కహకహార్భటి చాల దిక్తటుల నించి
వేగ నానావిధాయుధవృష్టి ముంచి
కదన మొనరించి రిట్టు లగ్గలిక మించి. 42

ఉ. అత్తఱి ధారుణీతలవియత్తలము ల్గన నొక్కటయ్యె న
న్మత్తసురారిబృందములమాయల వహ్నియమాదిదిక్పతు
ల్పత్తర మంది తత్ప్రతివిధానము సేయ నెఱుంగ రైన నా
యత్తత నేమియుం దెలియ కయ్యమరేంద్రుఁడు నుండె దీనుఁడై.

ఉ. అంత జయంతుఁ డెంతయు రయంబున దేవహయంబు నెక్కి రే
వంతునిరీతిఁ జోదనలు వల్గనము ల్రవగా ల్చెలంగ నం
తంతఁ గణంగి కుందనపు టందపుసింగిణి మ్రోయఁజేసి కా
లాంతకదండచండవివిధాస్త్రపరంపర లెందు నించుచున్. 44

గీ. తనదు గాంధర్వమాయ నా దనుజవరుల
మాయ మాయించి వృషపర్వ మయుని దక్క
నసురముఖ్యుల నెనమండ్ర నైంద్రముఖ్య
దివ్యబాణాష్టకముల వధించె నపుడు. 45

చ. దనుజులపాటుఁ జూచి మదిఁ దల్లడ మందుచు నుండు శక్రునిం
గని గురుఁ డంత సంతసము గాంచి జయంత! జయంత! యెంత ని
న్నినుతి యొనర్తు నే ననఁగ వేడుక మీఱఁ బురందరుండు నం
దనునిం గవుంగిలించుకొని తద్దయు దీవనలిచ్చి మెచ్చుచున్. 46

వ. ఇవ్విధంబునం బురందరుం డమందానందంబున నందను నభినందనం బొనర్చి బృందారకసేనాసందోహంబులుం దానును చందురునిపయిం డాఁకుటయు నతండునుం దన సహాయులైన దైతేయులపాటును జయంతుని పోటునుం జూచి మనంబునఁ దాపంబునుం గోపంబునుం గదుర నెదుర సదరలజ్జావిషాదవేదనావిభావ్యుం డైన కావ్యునిం జూచి మీయీక్షణంబున కీక్షణంబున నారణంబు చేఁ బారణంబొనర్చెదనిమిషంబున ననిమిషులెట్లయ్యెదరో కనుంగొనుఁడని ప్రార్థించి శుక్రుని రథం బెక్కించుకొని శంఖకర్ణనామకుండైన నిజసారథిం జూచి నీరధి తెరల తెఱఁ గంటిన తెఱగంటిబలంబులం గనుఁగొంటివే గాడ్పుకంటెను మనంబుకంటెను మనరథంబును రయంబుగాఁ బఱపింపుము మాతలి సిగ్గుఁ బఱపింపుము నీ సూతచాతుర్యంబు నెఱపింపుము చూతమని యగ్గించుటయు నతండును నిజమనోరథంబున కనుగుణంబుగా రథంబు నడిపించుటయు వజ్రమణిగణప్రభావిభాసితంబును వైడూర్యమయహరిణధ్వజాభిరామంబు నగు నమ్మహాస్యందనంబు నంబరమణిబింబమునకుఁ బ్రతిబింబంబై వెలుంగు నప్పు డసురపట్టణంబులపయిం గిట్టి మేరుశరాసనంబు మోపెట్టు గట్టురాయల్లుని విధంబున నయ్యామినీవల్లభుండు గాండీవంబు మోపెట్టి గుణస్వనంబు గావించుటయు నమ్మహాస్వనంబు బ్రహ్మాండంబు నిండి యాఖండలాదిదిక్పతులం బెండుపఱచె నయ్యవసరంబున ననేకకోటి మార్తాండమండలప్రభాడంబర విడంబనంబైన యారాజుదివ్యతేజంబు సురాసురులకు దుర్నిరీక్ష్యంబై యుండె ననంతరంబ పద్మగర్భుండు పలుకుచిలుకలకొలికితోడం గూడ ఖండనంబు చూడఁ గోడెరాయంచ నెక్కి వేదంబులు నధ్యాత్మవాదంబులు యోగంబులు నఖిలయాగంబులు కాలాదిపదార్థంబులును మూర్తీభవించి తన్నుం గొల్వ నరుదెంచి కశ్యపాత్రివశిష్ఠవిశ్వామిత్రభరద్వాజప్రముఖులైన మహామునులం గనుంగొని బహువిధయుద్ధంబులం బేరు వడసి నడిపినన్న వారలిం

ద్రాది దిక్పాలకులు వీరలతోఁ జుక్కలరా జెక్కటి నెక్కరణిం
బెనంగునో చూడవలయు నని పలుకుచు దేవతలకు నదృశులై
యుండె నా సమయంబున. 47

క. శుక్రుని మృతసంజీవని
నక్రము లగు దనుజముఖ్యు లని బ్రతుకకమున్
విక్రమమున శశి నొక్కరు
శక్రుఁడు మెచ్చంగ గెల్వఁ జను మన కనుచున్. 48

ఉ. ఒక్కట దిక్పతు ల్విబుధయోధులతో శశిఁ జుట్టి ముట్టి పే
రుక్కునఁ జక్రము ల్సరియ లుగ్రగదాపరిఘత్రిశూలము
ల్పెక్కుశిలీముఖంబులను భీమగతి న్మొయి నించి ముంచి నల్
దిక్కులఁ గ్రమ్మి దొమ్మిగ ధృతి న్సమరం బొనరించి రుద్ధతిన్. 49

ఉ. అంత నితాంతకోపమున నత్రితనూభవుఁ డాత్మభారతీ
కాంతుఁ దలంచి మ్రొక్కి రణకౌతుక ముల్లసిల న్గణంగి య
త్యంతవిచిత్రలీల నొకయాయుధము న్దనపై రథంబుపై
నంతపయి న్దురంగ నివహంబుపయిం బడనీక త్రుంచుచున్. 50

సీ. వెండియుఁ గడఁగి చండ్రింపు గాండీవ కో
దండంబు కుండలిత ప్రశస్తి
నుండఁగా దిగిచి ప్రచండకాండంబు లొం
డొండ దిఙ్మండలి నిండ నేసి
తండతండముగ వేదండంబులను రథ
కాండంబు లశ్వప్రకాండములను
గండు మీఱు భటాళి ఖండఖండంబులై
దండఁ దరిగినట్లు భండనమున

గీ. మొండుకొనఁ జేసి కండలకొండ లెనఁగఁ
గుండలను గ్రుమ్మరించినదండి రక్త
కాండములు గురియించి బ్రహ్మాండ మదర
దండిగా నార్చె నిర్జరు ల్బెండుపడఁగ. 51

క. పదిదర మొకటి శశియేసినఁ
బదినూత్రై వేయు లక్ష పదిలక్షలు న
ర్బుదము ననంతంబునునై
యదె ముప్పదిమూఁడుకోట్లయమరుల ముంచెన్. 52

గీ. ఘంట నాడించిన వితాన గండు తేఁటి
మొఱయుచందాన జలధర ముఱుమురీతి
నుఱిమి గీచినభాతినై యుత్పలాప్త
నారి రణమున మ్రోసె నాదార కపుడు. 53

సీ. అనువు లాసింపని వసువుల నెనమండ్ర
ననదృశాంబకములపస యణంచి
యద్రులగతి మీఱు రుద్రుల బాణ స
ముద్రమగ్నులఁ జేసి కౌద్ర ముడిపి
తిద్ద రాజిల్లు పన్నిద్ద రాదిత్యుల
వద్దఁ జేరక మున్నె సద్దుమాన్పి
కత్తులు పూని యున్మత్తులై వచ్చు మ
రుత్తుల సముదగ్రవృత్తిఁ బాపి

గీ. మఱియు గంధర్వకిన్నరగరుడసిద్ధ
సాధ్యచారణయక్షభుజంగపతులు
చండగాండీవముక్తాస్త్రసమితి ముంచి
లీలఁ బఱపెను బంచబంగాళముగను. 54

ఉ. ఏచి జయంతుఁ డయ్యెడ నహీనశరంబులఁ జంద్రు నొంచినన్
బూచిన మోదుగం దలఁపఁ బోలి యతం డలుక న్నచీసుతుం
జూచి తృణీకరించి నగుచు న్వడి చన్మరయందు నుగ్రనా
రాచము నాటి వ్రాల్చెనుధరాస్థలి శుక్రుఁడు మెచ్చి యార్వఁగన్.

ఉ. అంత జయంతుపాటు హృదయం బెరియింప నిలింపభర్త చౌ
దంతిని డిగ్గి కాంచనరథం బధిరోహణ చేసి రోషదు

ర్ధాంతత మాతలిం గని సుధాకరుపై మన తేరుఁ బోవ ని
మ్మింతట చంద్రుఁ డయ్యెడిని నింద్రుఁడు నయ్యెడి నిజ్జగంబులన్.

క. అని పల్క ననిమిషేంద్రుని
మనమువలె బ్రయము మెఱయ మాతలి రథము
న్ననఁజేయఁ జంద్రుసారథి
యును రథ మభిముఖము చేసె నురువడి మీఱన్. 57

ఉ. ఇద్దఱు నప్రమేయబలు లిద్దఱు నేర్పరు లస్త్రవిద్యచే
నిద్దఱు నుగ్రసాహసికు లిద్దఱు నక్షయబాణశోభిత
ల్పద్దులు మీఱఁ దారసిలి పద్మభవాండము శింజినీధ్వని
న్బ్రద్దలువాఱఁ బోరి రటు పాకవిదారియు కోకవైరియున్. 58

ఉ. అక్షులు వేయిటం గినుక నగ్నికణంబులు రాలఁగా సహ
స్రాక్షుఁడు మండలీకృతశరాసనుఁడై రథరస్మికేతుచ
క్రాక్షతురంగసారథిసమన్వితమాగతి సారసారిపై
లక్షశరంబు లేసెను విలక్షత భార్గవుఁ డాత్మఁ గుందగన్. 59

ఉ. చందురుఁడు న్పురందరనిశాతశరాహతిఁ గంది నివ్వెఱం
జెందఁగ నింద్రుఁ డిట్లను శశీ! వినరా వినరాని పాతకం
బందినవాని కార్తి యరుదా గురుదారకృతాపరాధమే
ధం దిగఁ ద్రోచి చేసితి వృథా విబుధావళితో విరోధమున్. 60

క. శావరమునఁ గానవు నీ
శా వర మజుఁ డిచ్చె ననుచు నగి చెల్లెను నీ
కీ వఱకును విడువు మిఁక
న్నీ వరదర్పము నణంగ నేఁడు మృగాంకా! 61

క. ఆ మాటల మన మెరియం
గా మదనుని మేనమామ గద్దింపుచు సు
త్రామా నీ మాహాత్మ్యము
నీ మహిజను లెఱుఁగ రొక్క యే నెఱుఁగనొకో! 62

సీ. కోడివై మదనుని కోడివై కృతి నహ
ల్యాజారతను గాంచినట్టి దూఱు
గురువైనయట్టి యీ గురు వైచి విశ్వరూ
పుని గురు చేసి దునిమించిన యఘంబు
యంబ యా దితికి న్యాయం బెఱుంగక గర్భ
ఘాతం బొనర్చిన పాతకంబు
యక్షహాయంబన యజ్ఞత ప్రముచ్చిలి
సగరుఁ గీడ్పఱిచిన తగని వితము
గీ. మఱచితో; పరుఁ దెగడెదు మదముకతన
సిగ్గుపడలేవు నీ మేను చిన్నెలన్ని
పరుసములు పల్కెదను గెల్వఁదరమె నీకు
విడువుమీ నోరి క్రొవ్వోరి! వృత్రవైరి! 63
చ. అని యనివార్యరోషమున నగ్నిశిఖాసఖమా శిలీముఖం
బొనరఁగ వింటఁబూన్చి భయదోర్జనగర్జన నిర్జరాధిపు
న్ననుమర నాట నేయుటయుఁ జాపము కోపము వైచి తేరిపై
ఘనతరరక్తపూరములు గ్రక్కుచు స్రుక్కుచు వ్రాలె గ్రక్కునన్.
క. ఆ హరిహయుపాటునకు, స్వాహాకారంబు లెసఁగ నజ్జారిపై
న్స్వాహాధిపాదిదిక్పతు,లాహవమునఁ గ్రమ్మి కురిసి రమ్ములవానల్.
గీ. వారి నందఱి మీఱియవ్వారిజారి
వారిధర మభ్రవీథి నవ్వారిగాఁగ
వారిధారలు నిగిడించుదారి భూరి
భూరిపుంఖాస్త్రముల నించెఁ జేరి చేరి. 66
ఉ. ఆ యెడ మూర్ఛఁదేరి విభుధాధిపుఁ డాగ్రహదుర్నిరీక్షుఁడై
కో యని యార్చి పేర్చి శతకోటి కరంబునఁ బూని పూనికె నేఁ
డా యజుఁ డిచ్చినట్టి వర మైనను నా పని మైన నిల్చుఁగా
కీ యుడుభర్త శౌర్యము సహింతునె నే నని యేయ నెంచఁగన్.

గీ. శక్రశమనాదిదిక్పతు లుగ్రుఁ గూడి
శక్తిదండకృపాణపాశములు నీటె
గదయు శూలముఁ గొని విశాఖరునిఁ గిట్టి
దిట్టలై బెట్టుగా నరికట్టుకొనఁగ. 68

మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె దిగ్దంతు ల్చలించె న్దివా
కరబింబంబు విహీనతేజ మగుచు న్గన్పించె ఘూర్ణిల్లె సా
గరముల్ సప్తకులాచలంబు లదరెం గంపించె నానాచరా
చరసందోహము లప్డు పద్మభవుఁడు న్సంక్షోభితస్వాంతుఁడై. 69

ఉ. జంభవిరోధిముఖ్యు లతిసాహసవృత్తి నిజాయుధంబు లు
జ్జృంభితలీల నిట్లు గొని చేరఁగఁ జంద్రుఁడు శుక్రుఁ జూచి సం
రంభము మీఱ మద్భుజపరాక్రమచాతురి చూడు మంచు సం
స్తంభననామకాస్త్ర మురుచాపమున న్దెగదీసి యేసినన్. 70

ఉ. యెత్తినయాయుధంబు లవి యెత్తినకైవడి నుండ దేహముల్
మత్తిలినట్లు దిక్పతులు మ్రాన్పడి యెద్దియుఁ జేయఁజాలక
న్జిత్తరుబొమ్మలో యన విచేష్టత నొందిన యత్తఱిం జయో
ద్వృత్తిని జంద్రుఁ డార్చెను విదిక్కులు దిక్కులు పిక్కటిల్లగన్. 71

సీ. అంకురత్పులకజాలాంకితగాత్రుఁడై
భూషించె నలుమొగంబులను బ్రహ్మ
గెలిచెఁ జంద్రుఁ డటంచు జలధరగంభీర
గరిమ ఘోషించెను గగనవాణి
హర్షసంభ్రమసంభ్రుతాత్ముఁడై చంద్రునిఁ
బేర్మిఁ గౌఁగిటఁ జేర్చె భృగుసుతుండు
శంఖభేరీముఖస్వనములు విలసిల్ల
వనజారి నుతియించె దనుజబలము
గీ. కుంచ సారించుకొనుచు నికుంచనాది
చిత్రగతులను జేతుల చెలఁగనాడె

సమరహంవీరుఁడే జీవు చంద్రుఁడే య
టంచు నారదమౌని ప్రియంబు ప్లూని. 72

చ. అనిమిషరాజి యీ గతి మహాజిఁ బరాజితవృత్తి నొందుట
గ్గని గురుఁ డాత్మలోన భయకంపము లుప్పతిలంగ గ్రక్కున
న్దినకరుఁ జేరఁగా నరిగి దీనతఁ దద్వ్యథమెల్లఁ దెల్పి మ
మ్మును గృపఁగావవే యనుచు మ్రొక్కియుసుం డతిభక్తి నిట్లనున్.

క. వెఱపేటికి నేఁగలుఁగగ, గురుఁడగు నీ యాజ్ఞఁబూని కువలయమిత్రు
న్వరముల నైనను భీకర, కరములచే నైనఁదృంతుఁ గరమరుదారన్.

సీ. అని పల్కి జోడులేనట్టి బండిని మీఱు
తన తేరనూరుఁ డుద్ధతినిఁ దోల
శీతాంశుపైఁదాఁకి శితసాయకము లేయ
నాయమ్ము లతని యాయమ్ములంటి
కాయమ్ము లోనరింపఁగా వెండియు నినుండు
వాఁడి మయూఖము ల్వేఁడి మెఱయఁ
బఱపి యుద్ధతిఁ జరాచరజంతువుల నెల్లఁ
బేలగింజల రీతిఁ బెట్లఁ జేయ

గీ. నలుక హిమరశ్మి నిజకిరణాళి నించి
యా మహాతాప మణఁగింప నప్పు డుష్ణ
శీతసంయోగమున వ్యతీపాతసంజ్ఞ
పాడమె నొక్కెడ ముజ్జగంబులు వడంక. 75

క. ఈగతి గవిసిన నాతని, వేగమె యోగముల కెల్ల విభుఁడవుగమ్మా
బాగుగ నంచు విరించిని, యోగించె జగత్త్రయీహితోచితమతియై.

శా. ఈలీల న్హిమధాముఁ డర్కుఁడును దా రెంతే వడిం బోరఁగా
నా లోనం గురుఁ డాత్మ నారసి జగత్ప్రాణు న్నిరీక్షించి వే
కైలాసంబున కేఁగి నీవు శశివార్తాఖ్యం బంతయుం దెల్పి యా
నీలగ్రీవుని దోడి తె మ్మతఁడు హీనిం గెల్చుఁ గయ్యంబునన్. 77

క. నా విని పవనుండట్లం, గావించెద ననుచు మ్రొక్కి ఘనతరరంహో
ద్ధావిత సకలకులాద్రి, ప్రావనికాభాగుఁడగుచు చనిచని యెదుటన్.

సీ. గర్వదూర్వహపంక్తి కంధరబాహుకే
యూరముద్రాంకమై మీఱుదాని
కలధౌతమయ శృంగకాంతుల నేవేళ
వెన్నెలల్ గాయుచు నున్నదాని
దంతావళాననదంతఘట్టనలచే
వింతసంతనగాంచి వెలయుదాని
తతమహోన్నతలీలఁ ద్రైలోక్యలక్ష్మికి
నిలువుటద్దమురీతిఁ జెలఁగుదాని

గీ. రుద్రకన్యామణీగీతవిద్రుతాశ్మ
సంతతామ్రేడితాంబునిర్ఝరసమూహ
రమ్యముక్తాశిలాపవిరాజితోప
కంఠ మగుదాని రౌప్యనగంబుఁ గనియె. 79

మహాస్రగ్ధర.

కని యీశు న్వామవామాంగకరుచివిలసత్కంధ రాకాంతిదూర్వా
ఘనతర్షోత్కర్షరింఖత్కరసదన మృగగ్రాసవిత్రాసలోల
త్తనుభూషాభోగిభోగాతతమణికిరణోదారవైభాతికశ్రీ
జనితోల్లాసానురంజత్సకలమునిదృగబ్జప్రకాశు న్గిరీశున్. 80

గీ. కాంచి భృంగి నివేదితాగమనుఁ డగుచు
ననిలుఁడు తదాజ్ఞ నేఁగి సాష్టాంగ మెఱఁగి
చేరి యందంద వినుతించి నీరజారి
యనుచితాచార మెఱిఁగిచి యభవుతోడ. 81

క. అమరుల కతనికిఁ గలిగిన, సమయము వివరించి దేవ! చనుదెంచిసురో
త్తములం బ్రోవుదయ లోకములకుఁ గర్తవగు నీవు గావఁగవలదే?

చ. అన విని యింత దుర్జనుఁడె హా! హరిణాంకుఁడు; వీని దక్షునిం
దునిమెడునాఁడు పాదమునఁ ద్రోచితిఁ గాని వధింప నైతి నేఁ
డనిమొనలోన వానిఁ దెగటార్చెదఁ దీర్చెద మీకుఁ బన్నముల్
నను శరణంబుఁ జొచ్చినజనంబు మనంబున నొవ్వఁ జూతునే? 83

మ. అని రోషాగ్నికణంబు లుప్పతిలఁగా నా దేవదేవుండు ది
గ్గనఁ దా లేచి మృదూక్తి నంతిపురికిం గాత్యాయనీకాంతఁ బం
చి నగోదగ్రకకుత్థముజ్జ్వలరుచిం జెన్నొందు మిన్నందు నం
దిని వేగంబున నెక్కి తూర్యరవము ల్దిక్చక్రముల్నిండగాన్. 84

క. ఆ నిటలాక్షుఁడు శూలము, ఖానేకమహాయుధంబు లరిభయదములై
కానఁబడ నపుడు ప్రమథగ, ణానీకముతోడ నడిచె నబ్జునిమీఁదన్ 85

ఉ. అంబరవీధి భూతనివహంబులతోఁ జను దెంచి మించి యా
శంబరవైరివైరి రభసంబున నంబుజబాంధవుండు న
య్యంబుజవైరియుం బెనఁగ నడ్డముసొచ్చి యదల్చి వజ్రతీ
క్ష్ణాంబరకోటి నాఁటె హరిణాంకునిపై గురుఁ డుబ్బ యార్వఁగన్.

మ. ప్రమథుల్ ఘోరతరాట్టహాసములచే బ్రహ్మాండ మూటాడ శూ
లముసుంశీశరశక్తికుంతకరవాలప్రాసచక్రాదిశ
స్త్రమయాసారము నింపఁ జంద్రుఁడు వడిన్ సర్వాస్త్రసంహారకా
స్త్రముచేత న్వివిధాయుధోత్కరము చూర్ణంబై చనం జేయుచున్.

క. వారలఁ దఱుమఁగ గజముఖ, భైరవశక్తిధరవీరభద్రులు చంద్రున్
బారావారచతుష్కము, మేరువుచుట్టుకొనురీతి మొఱయం బొదువన్.

గీ. నాతికై పోరు నా నలినారి నారి
వింట సారించి యుద్ధతి మీఱ వారి
కందఱకు నన్నిరూపులై యని మొనర్చెఁ
జాపవిద్యావిలాసంబు జగము పొగడ. 89

ఉ. లావున నార్చుచున్ గలుఁగులాయపు దేజివజీరుఁ డంకుశం
బా వనజారిపైఁ బఱప నాతఁడు దాననె యయ్యిభాననున్

జేవడిఁ గుంభమధ్యమునఁ జేరిన మౌక్తికపాళి రాలెఁ దా
రావని తామణీకుచభరంబున కౌనని చంద్రుఁ డెన్నఁగన్. 90

లయగ్రాహి.

దారుణజగత్త్రప్రళయవారిదశయస్తనిత
భైరవధమంధమఘనారవమహౌఘ
కారవుఁడు భైరవుఁడు మీఱి బహుభూతపరి
వారములు నల్దెసలఁ బేరములు వారన్
ఘోర మగు శూల మొగి నా రజనివల్లభుని
పై రవళి వైవ నతఁ డౌర యనుచుం దు
ర్వార గురుదివ్యశరవాలములఁ జూర్ణముగ
ధారుణిఁ బడం గెడపెఁ జేరువన దానిన్. 91

ఉ. ఆ సమయంబునం గుహుఁ డహంకృతితోఁ దనచేతిశక్తి చే
నేసి నభంబు ఘూర్ణిలఁగ నిత్తిగమోముల నార్వ నబ్జుఁ డ
బ్జాసనదత్తశక్తిని రయంబున వైవ మహోల్కలో యనం
గా సరిఁబోరి నయ్యుభయశక్తు లశక్తులరీతిఁ గ్రమ్మఱన్. 92

స్రగ్ధర. రౌద్రావేశంబు మీఱం బ్రబలభుజబలప్రౌఢిమన్ వీరభద్రుం
డద్రు ల్గంపింప లోకం బవియఁగఁ బ్రళయారభ్రార్భటిం బట్టసం బ
త్యుగ్రదేశస్ఫూర్తిచే నయ్యుడుపతిపై బెట్టూన్చి వే వైచె వైవన్
గదాంరిపుత్రాభిక కాండోత్కరమున శశి శీఘ్రస్థితిం ద్రుంచె దానిన్.

క. తనయులు ప్రమథులు నీగతి
యనిఁ జంద్రునిచేత నొచ్చు టభవుఁ డచ్చోఁ
గనుఁగొని ఘనసారద్యుతి
ఘనసారవృషంబు నతనిఁ గదియం దోలెన్. 94

క. వచ్చు నిటలాక్షుఁ గనుఁగొని, చిచ్చఱపిడుగులను బోనిశితవిశిఖంబు
ల్విచ్చలవిడిఁ గురియించుచు, నచ్చెందొవవిందు నిలువనభవుఁడునగుచున్.

గీ. అత్రినందన! నీదె గార్హస్థ్య మెన్న
గురువునకు బొమ్మ పెట్టి చేకొంటి కీర్తి
యిట్టి సుతుఁ డొకరుఁడె చాలు నింటి కెల్ల
రాజ వీ వైనఁ గొద వేమి రాష్ట్రమునకు. 96

క. నినుఁ జేపట్టి వరం బిటు, లనువుగ నిచ్చిన విధాత ననవలెఁగాక
న్నిను దూఱం బనిగలదే, వినరా నీ గర్వమెల్ల విడిపింతు ననిన్.

క. నీ మేనల్లుఁడు గావునఁ, గాముఁడు నీకరణి దుండగము చేసి కదా
మామకఫాలాగ్నిశిఖా,స్తోమాహుతియయ్యె వానిఁ ద్రోవమె నీకున్.

ఉ. నా విని చంద్రుఁ డిట్లనియె నవ్వుచు మీ రిటు లాడ నుత్తరం
బీవలె మీ వలెం దిరుగ నేరికి నౌను జితేంద్రియస్థితిన్
భావజు గెల్చినాఁడ నని పల్కితి వంతటివాఁడ వయ్యుమా
దేవికిఁ దక్కు మోహమున దేహములో సగ మియ్యఁ జూతురే.

గీ. అవని మర్యాద దప్పనియతనిపత్ని
యనక మఱి మోహమెసఁగంగ నబ్జగంగ
వెడలనీక మహాజటావిపినమునను
మాట లేదొ ధరిత్రి నీ మాట లేదొ. 100

క. దారువన మౌనికాంతా,జారుఁడ వగు నీకు నొరుల చక్కటు లేలా
మారాడక యనిఁబోరుము పౌరుష మొకకొంత యైనఁ బను పడియున్నన్

క. అని పలికి గాండివము చేఁ,గొని భువనత్రయము నతలకుతలముగా శిం
జిని మ్రోయఁ జేసి స్థాణు,న్నను శరపరశువుల నొత్తు నిలు నిలుమనుచున్

సీ. ఆగ్నేయశర మేయ నది యగ్నిలోచను
ఫాలాగ్నిలో నైక్యభావ మొందె
నహిసాయకం బేయ నది నాగభూషణు
భూషణంబులతోడఁ బొందొనర్చె
నంబుదాంబక మేయ నదిజాహ్నవీధరు
తలయేటి కభివృద్ధి గలుగఁ జేసె

నద్రిబాణంబు జేయ నది గిరిజేశుఁ డా
వంకకుఁ బుట్టినిల్వరునఁ జేస్సె
గీ. విధుఁడు గ్రక్కునఁ బైశాచవిశిఖ మేయ
నదియు భూతేశుభూతాళి ననుసరించె
మఱియు శశి వైచు నిఖిలాస్త్రమండలంబు
నఖిలమయుఁ డైన శంకరునందు డిందె. 103
చ. అజగవకార్ముకంబుఁ గొని యంతఁ బురాంతకుఁ డుగ్రమార్గణ
వ్రజము లపారసంఖ్యలుగ వారిరుహారిశరీరయష్టి న
శ్రజముగ నేయ నాతఁ డధికవ్యథఁ జెంది సుధాంశుఁ డొటచే
నజుని వరంబుచే నిలిచె నాజిని బ్రాణముతోడ ధీరుఁడై. 104
ఉ. కంజవిరోధి యంత నలుకం జలియింపక చాపశింజినీ
సంజనితారవంబున వెస న్జగము ల్వొగడం బురత్రయీ
భంజనుగాత్రి మంతయుఁ బ్రభంజన తీవ్రశరాళి నించెఁ గి
న్కం జలజారిఁ ద్రుంచెద నిఁకం జయ మొందెద నంచు నుగ్రుఁడై.
క. పశుపతి పాశుపతాస్త్రము, శశి లక్ష్యముఁ జేసి వింట సంధించినఁ బ్ర
హ్మశిరోనామకమగుది, వ్యశరముధాతకును బ్రొక్కి యాశశిదొడిఁగెన్.
శా. ఆ దివ్యాస్త్ర మహాగ్నికీలములచే నంభోనిధుల్ గ్రాగె బ
ల్బ్బాదై హేమమహీధరంబు గఱఁగెన్ భూతౌఘముల్ బ్రోసె ది
గ్వేదండంబులతో ధరిత్రి యొరిగె న్వేధోండ మూటాడె మ
ర్యాద ల్దప్పెను తారకాగ్రహగణం బవ్వేళ భీతాత్మలై. 107
క. సప్తర్షిముఖ్యులతిసం, తప్తాత్మత నోర్వలేక ధాతం గని యీ
దీప్తాస్త్రవహ్ని ప్రళయము, ప్రాప్తంబై నట్లుదోఁచెభయముడుపఁగదే.
గీ. ఎంత లే దని క్షణ ముపేక్షింతు వేని
మగుడ సృజియింప వలయు నీ జగము నెల్ల
మాకుఁ గా వీరి కయ్యంబు మాన్చి తార
నమరగురునకు నిప్పింప వయ్య! నీవు.

చ. అన విని పల్కుకల్కిమగఁడంత దయారసపూర మూరఁ బం
తున నునుపైఁడితమ్మివిరితూఁడు లఖాణపుఁదేజి నెక్కి స
న్మునిగణము ల్భజింప నలుమోముల నవ్వు జనింప వచ్చె న
వ్వనరుహవైరియు న్త్రిపురవైరియుఁ బోరుచునుండుచోటికిన్.

గీ. వచ్చి నిజవాహనము డిగ్గి వనజభవుఁడు
భవుఁడు దను జూడ వలగొని భక్తిమీఱ
మీర లీ రీతిఁ జలమునఁ బోరఁ దగవె
తగవె మము కావ నని చాలఁ బొగడఁ దొడఁగె. 111

సీ. జయజయ శతకోటిశతకోటిసమశూల!
జయ భానుభానులసజ్జటాల!
జయజయ సుగుణోపచయ చయనారాధ్య!
జయ నీలనీలభాస్వరశిరోధి!
జయజయ భవభవసాగర తారక!
జయ తారతారకా సదృశవర్ణ!
జయజయ శివ! శివాస్పదవామతనుభాగ!
జయ సర్గదక్షదక్షమఖవైరి!

గీ. జయ మహాదేవ! దేవతాజయదభావ!
జయ దయాకర! కరరాజ జయతురంగ!
జయ జితాసుర! విరచితసాధుసౌఖ్య!
జయ గిరీశ! గిరీశవేశ్మప్రశస్త! 112

క. ఉపనిషదుక్తి శతంబులు, ప్రపంచభర్తవగు నిన్ను బ్రతిపాదించున్
జపహోమాధ్యయనవ్రత, తపములకున్ఫలమునీవ ధార్మికభావా!

చ. అనిచతురాననుండు చతురాస్యముల న్నుతియించి యిట్లనున్
గనకగిరీంద్రచాప! విను కయ్యములో నెదిరించి వీఁకచే
ననిమిషకోటి గెల్చుట మహాతిశయం బని యీశ! యీ శశాం
కునిఁ గరుణించి నీ శరము కోపము నీ వుపసంహరింపవే. 114

గీ. అను విరించిమృదూక్తుల నాదరించి
శంకరుఁడు పాశుపత ముపసంహరించి
నిలుచునంత విధుండు వాణీనియంత
పంచినశరమ్ము డించెఁ జాలించె దురము. 115

కం. అజునకు నటుమును జితకా, యజునకు శశి ప్రొక్కి నిలువ నత్తఱి నసురా
గజముదమున రారమ్మని, గజముఖజనకుండు విధునిఁ గౌఁగిటఁ జేర్చెన్

గీ. శంకరుండును బంకజాసనుఁడు కరుణ
జంభరిపుముఖ్యసురభుజాస్తంభనముల
మాన్ప వారలు నా జగన్మాన్యులకును
ప్రొక్కి నుతియించి నిలిచిరి ప్రోల నపుడు. 117

మ. అరవిందాసనుఁ డప్పు డిట్లనియె చంద్రా! యీ చలం బేటికి
స్మరలం దార నొసంగుమీ గురునకు న్మాయాజ్ఞచే నీ వన
న్పరమేష్ఠిం గని పల్కె దేవ! విను నా పంతంబు దిక్పాలకు
లక్కఱము ల్గట్టక క్రమ్మఱ న్విడువ నీ కాంతం గురుం జేరఁగన్. 118

గీ. రాజ! నీచేతఁ జేయింతు రాజసూయ
మప్పు డమరులు నీ కిత్తు రప్పణములు
నిప్పు డిత్తన్వి గురునకు నొప్పగింపు
మేను పంచినపని చేయు టెగ్గుగాదు. 119

చ. అని పరమేష్ఠి పల్కుటయు నట్లన కా కని చంద్రుఁ డయ్యెడ
న్ఘనతరగర్భభార నఖకాంతివినిర్జితతారతారఁ దా
ననునయసూక్తులం దెలిపి యంపినతోడనె దివ్యతూర్యని
స్వనములు ప్రోసె మింట విరివానలు పర్వెను జంటజంటగన్.

సీ. ఉడుపతి సంగతి నెడపి తాఁ జనలేని
వడువున నడలందు జడనుదోఁప
గురుతుగా కేరాజు విరహార్తి చేఁబలె
పాండిమ చెక్కుల నొందుకొనఁగ
ముదినున్న వనజారి మొదకప్పు పైకి వె
ల్వడె నాఁగఁ జన్మొన ల్నల్లుమీఱ
రెక్కరాయని ఛాయ డొక్కట గల్గిన
ట్లొక్కట మైకార్శ్య ముప్పతిల్ల
గీ. మనసు చంద్రునికడ నుంచి ప్రయాసపడిన
తనువుతో గర్భగౌరవతాంత యగుచుఁ
జిన్నవోయిన మోమున సిగ్గు దోఁప
నాంగిరసుచెంతకును జేరె నపుడు తార. 121

చ. అమరులతోడ నప్పు డని రబ్జభవుండు భవుండు నగ్గురుం
బ్రమదము మీఱఁగాఁ బిలిచి మా వచనంబునఁ దారఁ జెందుమీ
రమణి కశుద్ధి లే దమృతరశ్మిని బొందుటచేత దాన నీ
కొమ పరిశుద్ధిఁగాంచెఁ గయికొమ్మనఁ గొమ్మగురుండు చేకొనెన్.

గీ. రాజరాజసఖుఁడు రాజీవభవుఁడును
జంద్రు నిందు) సురలసదనమునకుఁ
బంచి గిబ్బతేజి నంచకంఖాణంబు
నెక్కి చనిరి విభవ మెసఁగ నపుడు. 123

క. మృతసంజీవని సంజీవితులగు నసురులును దాను విధుశివసమరో
ద్ధతిఁ జెప్పికొను చుశుక్రుఁడు,నతిహర్షము మీఱ నరిగె నంతయు ఫేచ్ఛన్

గీ. నవమమాసంబునం దొక్కనాఁడు శుభము
హూర్తమునఁ గాంచెఁ దారామహోత్పలాక్షి

బుధుని సుజ్ఞాని మోదితబుధుని రూప
విధుని సద్భక్తిపూజితవిదుని నంత. 125

ఉ. తత్సమయంబునన్ శశి ముదంబున నచ్చటి కేఁగుదెంచి పు
త్రోత్సవ మాచరింప విని యుద్ధతితో గురుఁ డిందుఁ జూచి య
స్మత్సుతుఁ డీ బుధుం డిట నిశాకర రాఁ గత మేమి నీ కనన్
మత్సరబుద్ధి వారికిఁ బునఃకలహంబు జనించె నయ్యెడన్. 126

క. అజుఁ డరుగుదెంచి గురునిన్,రజనీకరుఁ గాంచి యిట్టిరచ్చలుగలవే
గజిబిజి వలదని తారా,గజయానం జేరఁబోయి గ్రక్కునఁ బలికెన్.

క. గురునకొ గర్భంబు నిశా,కరునకొ వివరింపు రిత్తకలహము వల ది
త్తఱి మరల నావు డాబి,త్తరితామరమాలి కనిమెఁ దద్దయులజ్జన్.

గీ. స్రష్ట వగు నీ వెఱుంగవె సకలభూత
సంభవము, మేలె నన్ను రచ్చలకు నీడ్వ?
హరిహరీ! దాఁచ నేల, తారాధిపతికి
సుతుఁడు వీఁ డని వివరించె సూక్ష్మఫణితి. 129

క.నావినియజుఁడోహోహో,మీవాదముచాలుఁగుముదమిత్రునిపుత్రుం
డీ వత్స, యితనిఁ జంద్రుని,కీ విమ్మా వలదువిరస మిఁక నాంగిరసా.

చ. అని గురుచేత నబ్బుధుని నత్రితనూజుని కియ్యఁజేసి నీ
తనయుఁడు వీఁడు సద్గ్రహపదప్రభుత న్విలసిల్లు మీఁద నీ
వనువున రాజసూయము రయంబునఁ జేయుము నీకు దిక్పతుల్
ఘనయశ మొప్పఁ గప్పములుగట్టెద రంచు వచించి యేఁగినన్.

ఉ. ఆ నలినారియు న్సుతసమన్వితుఁడై గజ వాజి ముఖ్య సే
నానివహంబు గొల్వఁగ జనంబులు సన్నుతి సేయఁగాఁ బ్రతి
ష్ఠానపురంబుఁ జేరి యచట న్బలభిన్నభవైభవంబులో
నానలవైరియై సుకృతియై క్షితి రాజ్యము సేయుచుండఁగన్. 132

ఉ. దక్షుఁడు చంద్రురూపబరదక్షత లారసి సంతసంబునన్
లక్షణభాగ్యయౌవనవిలాస కళావిభవంబుల న్సహ
స్రాక్షవధూసమాన లగు నాత్మతనూజల నిర్వదేడ్వుర
న్బక్షము మీఱ నీతనికి భార్యలఁ జేసెద నంచు వచ్చినన్.

గీ. తారకాధ్యక్షుఁ డప్పు డా దక్షు భక్తిఁ
బూజ గావించి నేఁడు మ త్పుణ్యఫలము
కరణి వచ్చితి నేఁ జేయు కర్జ మెద్ది
నావు డిట్లను బరమేష్ఠినందనుండు.

క. అశ్విని మొదలగు కన్యల, నశ్వీమనోభవస్వరూపుఁ డగు నీ కిత్తు
న్శాశ్వతముగవర్ధిలుమమి, తైశ్వర్యముగలిగిచంద్ర! యరిజయసాంద్రా!

చ. అని శుభలగ్నమందుఁ గమలాసనుఁ డత్రియుసమ్మతింపఁగాఁ
దనయుల నిర్వదేడ్వురను దక్షుఁడు వేడుక ధారవోసె న
త్యనుపమవైఖరి న్గువలయాప్తునకు న్దివి దేవదుందుభి
స్వనము లెసంగ దివ్యసుమవర్షము లెల్లెడల న్జెలంగఁగన్. 136

గీ. ఎలమి సుముహూర్తమునఁ జెర యెత్తునంతఁ
బ్రేమ మది మీఱఁగాఁ జందమామ చెలుల
కెంపుమోవుల సుధకు గ్రుక్కిళ్ళు మ్రింగ
క్షితిఁ గలిగెఁ జందమామ గ్రుక్కిళ్ళు నాఁడు. 137

క. కళలఁ దగునిర్వదేడ్వుర, గళముల శశి మంత్రపూర్వకముగా మణిమం
గళసూత్రంబులు గట్టెన్, కలకంఠులు చేరి గౌరికళ్యాణ మనన్. 138

గీ. చెలఁగి యిఁక రాజసూయంబు సేయువేళఁ
దదభిషేకంబునను వారిధార లిట్లు
దొరఁగు నన్నట్లు ముత్తెముల్ దోయిలించి
లు దలఁబ్రాలు బోసి రా చంద్రుమీఁద.

క. సత్పద్మాననలపుడు ల, సత్ప్రాణుల లాజ లియ్య నవధూమము నీ
లోత్పలమాలికలనమ్మె, నుత్పలమిత్త్రుండు లాజహోమ మొనర్చెన్.

క. పొలయలక్కవేళ నేనిటు, వలె వివాహాదంబు లంటవలె నన్నటు కాం
తలయడుగు లెత్తి చేతుల, మెలకువ శశి సన్నెకల్లు మెట్టించెనటన్.

గీ. సూక్ష్మముగ నభ్రమున నన్నుఁ జూడవలయు
న య్యరుంధతి తన పెండ్లి కరుగుదెంచి
యునికి సులభంబుగాఁ జూచె నుత్పలాప్తుఁ
డంగనలు దాను జనులు భాగ్యంబనంగ. 142

క. పేరులు చెప్పుమటన్నం, దారాహ్వయ లనెడుశశిని దత్సఖు లెల్లన్
జేరి యితం డింకన్మదిఁ, దారను మరువఁడని నగిరి తద్దయునచటన్.

గీ. నాగవల్లిదాఁక నాలుగుదినము లీ
రీతిఁ బెండ్లి వైభవాతిశయముఁ
గాంచి చంద్రు దక్షుఁ గడు వేడ్క వీడ్కొని
చనిరి కమలజాది సకల సురలు. 144

సీ. వారదముల్ ద్విరదముల్ హరులు గ్రామంబులు
భద్రపీఠంబులు పల్లకీలు
నాందోళికలును జిత్రాంబరములు మణి
పాదుకల్సరటులు పట్టుదిండ్లు
సకినెలపాన్పులు జవ్వాజిపిల్లులు
కస్తూరి మెకములు కప్పురంపుఁ
బన్నీటిచెంబులు బంగరుతంబుర
ల్సకలభూషణములు సర్వములును

గీ. దాసదాసీజనంబులు తక్కుఁగల్గు
వస్తువు ల్పాత్రికలకును వరుసతోడ

నరణముగ నిచ్చి సుఖ ముండు డనుచు దక్షుఁ
డబ్జు వీడ్కొని భార్యతో నరిగెనపుడు. 145

గీ. అసమవైఖరి నిట్లు పెండ్లాడి చంద్రుఁ
డసమశరకేళి దక్షకన్యకలఁ గూడి
భూరితరసౌఖ్యజలరాశి పొంగఁ జేసి
శ్రీలు మెఱయంగ వసుమతి నేలుచుండి. 146

మ. ఒకనాఁ డా యుడువల్లభుండు మదిలో నుత్సాహ మింపొందఁగా
సకలద్వీపకలాపభూమిపతులు న్శక్రాది దిక్పాలుర
న్ప్రకటప్రౌఢిని గెల్చి కీర్తిరుచు లొప్ప న్గప్పను గ్గాంచి య
త్యకలంకస్థితి రాజసూయ మనువొంద న్జేయఁగా నెంచుచున్.

చ. అతిరయ మొప్ప నబ్ధిఁడు శతాంగము నెక్కి సమస్తసైన్యసం
తతి తనవెంట నంటి జలదధ్వని భీషణభేరికార్భటుల్
క్షితియు దివంబు బూరటిల గెల్చె మహోత్తత మేదినీశులన్
ధృతి మెఱయం బ్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యులదాక్షిణాత్యులన్.

క. జంబూప్లక్షకుశక్రౌం, చంబులు శాల్మలియు మరియు శాకద్వీపం
బుం బుష్కరాహ్వయద్వీ, పంబునునొకనాఁడె సీతభానుడు గెల్చెన్.

చ. పదపడి చంద్రుఁ డయ్యమరపాలుపురంబున కేఁగ నింద్రుఁ డిం
పొదవఁగ నబ్జుఁగాంచి కమలోద్భవు మాట దలంచి యిచ్చె న
న్మదగజవాజిరత్నలలనామణిభూషణకోటు లాగతిం
ద్రిదశులు తక్కిదిక్పతు లనేకధనంబు లొసంగి రొక్కటన్. 150

మ. రజనీవల్లభుఁ డి ట్లనర్గళమహారంహాశ్చమూఘాటి ది
గ్విజయం బొప్పఁగఁ జేసి నాల్గుదెసల న్వేలాద్రిశృంగంబులం
దు జయస్తంభము లూఁది చారణగణస్తోత్రంబు లాలించుచున్
ద్రిజగంబు ల్వినుతింప వచ్చెఁ బురికిన్ దేవేంద్రుచందంబునన్. 151

ఉ. వేలుపుఁబెద్ద యానతిని విష్ణునదీతటమందుఁ జాల సు
శ్రీలవిశాలలీల మణిచిత్రితమై తగు యాగశాల నా
వేళ రచింపఁ బంపె నతివిశ్రుతనీలవిరాజిరాజివా
చాలము నింద్రజాల మతిసంతసమై విలసిల్ల శిల్పకున్. 152

క. కువలయమిత్రుం డంతట, సువిహితనయసరణి రాజసూయముసేయ
న్నవనీతదీక్షఁగైకొని, ప్రవిశనమొనరించె శాలఁ బత్నులుఁ దానున్.

సీ. జనమోదనంబులు శాల్యోదనంబులు
సురచిరరూపము లూపములును
పటుసారభాన్వితపాకము ల్శాకము
లతులితరసములు నతిరసములు
హితవాసనాసమన్వితములు ఘృతములు
జితమధుసారము ల్క్షీరములును
సమధికరుచివిలాసములు పాయసములు
నధరీకృతామృతోదధులు దధులు

గీ. చవులు పొగడుచుఁ బజ్జలు సాగి వేడ్క
వెలయ భుజియించి కపురంపువిడియములను
జేకొని యహర్నిశంబు నాశీర్వదింతు
రవనిసురు లజ్జు రాజసూయాధ్వరమున. 154

ఉ. అత్రివశిష్టదక్షపులహాంగిరు లాదిమహామునీంద్రు లా
ద్గాత్రమహోత్ర మాధ్వరము దక్కనుగల్గినయాగకర్మముల్
సూత్రవిధానమై ఖరినిజొప్పడఁ జేయఁగ నక్కముద్వతీ
మిత్రుఁడు రాజసూయములు మేలుఁగ జేసెవిరించి మెచ్చఁగన్.

.. అనలుఁడు నమ్మహాధ్వరమునందు జెలఁగి ప్రదక్షిణార్చి యై
యనుపమమంత్ర పూతములు నాహుతులంది యథాక్రమంబుగా

పనిమిషకోటికియ్యె నతిహర్షమునం గొని తృప్తిఁ గొంది దీ
వెనలొనరించి రివ్విధుని వేయివిధంబుల సన్నుతించుచున్. 156

క. స్తుత్యాహంబున మునిసం, స్తుత్యముగా నిచ్చెబుత్విజులకుశశాంకుం
డత్యనుపమదానకళా, నిత్యుండై సకలధారుణీమండలమున్. 157

ఉ. ఘోటకము ల్రదంబులును గుంజరము ల్శిబికాసమూహము
ల్హాటకము ల్దనౌఘము:లు నంబరము ల్మణిభూషణంబులు
న్నాటి యొకింత లేకయె ప్రసన్నకదక్షిణ నిచ్చె దేవతా
కోటులు సన్నుతింప శశికోటులసంఖ్యలుగా మఖంబునన్. 158

గీ. సుప్రయోగమునను విప్రగణంబుతో
నాప్రయోగమునను యాగమట్లు
చేసి యవబృథంబు జేసి పత్నులుదాను
నమృతకరుఁడు నిష్ఠ నమరనదిని. 159

క. ఆరాజు రాజసూయం, బీరీతి నొనర్చి యంతనెంతయునిష్టన్
వారిజభవ నారాయణ, గౌరీశులఁగూర్చి తపముఁ గావించెతగన్.

క. ఆతపమునకుఁ జలింపక, నాతపమిట్లాచరింప నలని కజమురా
రాతి మహేశాను లతి, ప్రీతిం బొడఁగట్టి రమరబృందముగొల్వన్.

ఉ. రాజమనోజ్ఞ తేజ ద్విజరాజవు గమ్మని బ్రహ్మఁ బూన్చిన
త్ప్రాజితలీల నద్గ్రహవిభుత్వమునన్ విలసిల్లుమంచు నం
భోజవిలోచనుం డునిచె మోదముతో ధరియించె నాదలన్
రాజకిరీటసంజ్ఞ తగ నాగవిభూషణుఁ డానిశాకరున్. 162

క. హరిణాంకుం డీకరణి, న్వరములుగైకొని సమగ్రవైభవ మెసఁగ
న్పురమునకు వచ్చినీతి, స్ఫురణాత జనులెన్న నిఖిలభువనములేలెన్.

సీ. సమయంబు దప్పక జలదము ల్వర్షించె
హర్షించె మిగుల బ్రాహ్మణకులంబు

ధరణి ముక్కాలును దరగనిగతిఁ బండె
నిండె యాగక్రియ ల్నిఖిలదిశల
ధర్మంబు నాల్గుపాదంబులఁ గన నయ్యె
వినవయ్యె నారార వేదరవము
క్రేపులు తమయంత క్షీరము ల్గురిసెను
విరిసెను చోరాగ్ని వృజినభయము

గీ. సోముఁ డసమానసద్గుణస్తోముఁ డమృత
ధాముఁ డతులితవిజయాభిరామఁ డఖిల
తారకాసార్వభౌముఁ డుదారనీతి
నంచితంబుగఁ ధరణిఁ బాలించునపుడు. 164

క. ఆ చందంబున నెల్లపు, డా చందురుఁ డేలుచుండు నవనీరాజ్యం
బీచంద్రచరితము విను, ధీచతురులకు న్శుభంబు తేజముగల్గున్.

గీ. ఆయురారోగ్యకరము జయాస్పదంబు
పుత్రపౌత్రప్రదం బతిపుణ్యదాయ
కం బఖండమహీలాభ కారణంబు
వినుజనంబునకు శశాంకవిజయ మనిన. 166

వ. అనుటయు.

ఆశ్వాసాంతము.

ఉ. మంత్రియుగంధరాకృతివిమానితమంధర! దానకంధరా!
తంత్రవిదగ్రణీ! విమతదంతిభిదాసృణిసూక్తిధోరణీ!
మంత్రనిభేదనా! కుముదమంజులయశోధన! బోధబోధనా!
సంతసుపోషణా! జనమనఃప్రియభాషణ! వంశభూషణా! 168

క. శూరవరవారసన్నుత, తారకభూభృజ్జిగీషుతతకీర్తిధనా!
నారదతతవిహితసుధీ, భూరిరణార్దివవిపత్తు! పోషితకవిజనా!

తోటకము.

రాజమానమానరాజరాజరాజసన్ముఖాం
భోజభోజరాజనైజబోధబోధనస్తుతి
క్ష్మాజనాభిరామరామచంద్రకల్పకల్పవి
భ్రాజకీర్తిభూషితాంగవంగవంగళాస్వయా.

గద్యం.

ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవందనకందళితానంద కందాళ
రామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవ శేషము
కృష్ణయార్య తనూభవ సుకవిజనవిధేయ వేంకటపతి
నామధేయప్రణీతంబైన శశాంకవిజయం బను
మహాప్రబంధమునందు సర్వంబును
పంచమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామముద్రాక్షరశాల, రాజమండ్రి.

# వివిధ గ్రంథములు.

## ప్రబంధములు

| | |
|---|---|
| విజయవిలాసము | 0—6—0 |
| శృంగారశాకుంతల | 0—6—0 |
| బిల్హణీయము | 0—8—0 |
| భర్తృహరిసుభాషితము | 0—8—0 |
| మనుచరిత్ర | 0—6—0 |
| శశిరేఖాపరిణయము | 0—6—0 |
| రాజశేఖరచరిత్ర | 0—6—0 |
| సారంగధర చరిత్ర | 0—6—0 |
| వైజయంతీవిలాసము | 0—6—0 |
| పారిజాతాపహరణము | 0—6—0 |
| పండుగకట్నము | 0—6—0 |
| సుభద్రాపరిణయము | 0—12—0 |
| శ్రవణానందము | 1—0—0 |
| శృంగారపంచకము | 1—0—0 |
| చంద్రరేఖావిలాపము | 1—4—0 |
| లంబోదరప్రహసనము | 1—0—0 |
| రాధికాసాంత్వనము | 0—12—0 |
| సత్యభామాసాంత్వనము | 0—12—0 |
| అహల్యాసంక్రందనము | 1—0—0 |
| బిల్వేశ్వరానందము | 1—4—0 |
| యామినీపూర్ణతిలకము | 1—4—0 |
| పంచసాయకము | 1—4—0 |
| శృంగారమల్హణచరిత్రి | 1—0—0 |
| రాధామాధవసంవాదము | 0—12—0 |
| హంసవింశతి | 1—8—0 |
| వేమనయోగి పద్యములు | 0—6—0 |
| శివానందలహరి | 0—6—0 |
| జైమినీభారతము | 0—12—0 |
| పాండురంగమహాత్మ్యము | 0—12—0 |
| శ్రీనాథునిపద్యరత్నములు | 0—6—0 |
| బమ్మెరపోతనరత్నములు | 0—12—0 |
| రామకర్ణామృతము | 0—12—0 |
| కృష్ణకర్ణామృతము | 0—12—0 |

## కథలు

| | |
|---|---|
| భట్టివిక్రమార్కుని కథలు | 0—12—0 |
| మహాభక్త విజయము | 0—12—0 |
| భోజకాళిదాసు చరిత్ర | 0—6—0 |
| భోజకాళిదాసుకథలు | 0—6—0 |
| పంద్రెండురాజులకథలు | 0—8—0 |
| మదనకామరాజు కథలు | 0—8—0 |
| గులేబకావళి కథలు | 0—8—0 |
| అరేబియన్ నైట్సు కథలు | 0—8—0 |
| తెనాలి రామలింగని కథలు | 0—6—0 |
| ఇంద్రజాలము కథలు | 0—6—0 |
| శుకసప్తతి కథలు | 0—6—0 |
| మహాపతివ్రతల కథలు | 0—6—0 |
| మాఅవిడ మొగలిపువ్వు | 0—6—0 |
| పరమానందశిష్యుల కథలు | 0—4—0 |

## నాటకములు

| | |
|---|---|
| పద్మవ్యూహము | 0—8—0 |
| కృష్ణలీల | 0—8—0 |
| కనకతార | 0—8—0 |
| లవకుశ | 0—8—0 |
| హనుమద్రామసంగ్రామము | 0—8—0 |
| భక్తకుచేల | 0—8—0 |
| సతీఅనసూయ | 0—8—0 |
| కృష్ణరాయబారము | 0—8—0 |
| సతీసక్కుబాయి | 0—8—0 |
| కృష్ణతులాభారము | 0—8—0 |
| సంగీతసావిత్రి | 0—8—0 |
| బిల్హణీయము | 0—8—0 |
| సత్యహరిశ్చంద్ర | 0—8—0 |
| బుద్ధిమతీవిలాసము | 0—8—0 |
| సంగీతప్రహ్లాద | 0—8—0 |
| సంగీతశశిరేఖ | 0—8—0 |
| సంగీతసారంగధర | 0—8—0 |
| సంగీతజయంతీజయపాల | 0—8—0 |